# పీఠిక

చిరంజీవి 'వారణాసి' సుబ్రహ్మణ్యశర్మ వికసించు చున్న కవి. పూవుపుట్టగానే పరిమళ మన్నట్లితని ప్రథమ ప్రయత్నమైన కవిత్వమే గడుసుపాకములో నున్నది. తగినంత భాషాపాండిత్యము, భావన సందర్భోచిత శబ్దప్రయోగము ధారాశుద్ధి మొదలైన గుణము లీ శతకమునందు సన్నిహిత ములై యున్నవి. ఇతఁడు నాకు శిష్యుఁడు; శిష్యుఁ డన్న విషయ మీ భీమేశ్వరశతకము నిండ కనిపించును. "శ్రీమన్ని ర్ఝర చందమఃప్రథిత చాంద్రీపూర్ణ జాటాటవీ" మొదలైన పాదములు, ఈ శతకములోని దుష్కరప్రాస బాహుళ్యము మరల తెలుఁగు విషయముతో 'మూఁడూళ్ళగ్గి ని బుగ్గి చేసిన దొరా...' మొదలైనవి మచ్చిహ్నములు

ఇవి యన్నియుఁ బ్రస్తుత మల్ప ప్రయత్నముగాఁ గాన్పించినను భవిష్యత్తులో మహాకావ్య రచనకుఁ గావలసిన సర్వంకష ప్రయత్నము.

శతకములు మనభాషలో నొక ప్రత్యేకకావ్యశాఖ. పరభాషలో సంస్కృతములోఁగూడ శతకము లున్నను నవి మకుటములుకావు తెలుఁగువారి శతకము మకుటి. ఈ తెలుఁగు భాషలో నక్షత్రమాలయుఁ గావ్యమే. 'ఉదాహరణము' కావ్యము; 'శతకము' కావ్యము. దీనికిఁ గావ్యత్వసిద్ధి యెట్లన

ప్రశ్న. అనుస్యూతముగా నేకవిషయ మాద్యంతమం దుండు టొకటి. మఱియు నాలంకారికముగాఁ జూచినచో నొక యను భావము, ఒక సంచారి రసపోషకము లనియు, రసప్రతీతి హేతువులనియుఁ జెప్పఁబడుచున్నది. 'ఏకైకః ప్రబంధాయతే' అన్న నుడి, సమర్థుఁడైన కవి వ్రాసినచో శతకముఁగూడ మహాకావ్యము కావుట కభ్యంతర ముండదు. కవనముయొక్క గొప్పతనము కవియొక్క ప్రతిభాధీనము. ఆ ప్రతిభ పద్య రచన మొదలు కావ్యమునందు ప్రతీయమానమగు రసము వఱకు నభివ్యాప్తమై యుండును. జగన్నాథుఁడు భక్తి కూడ రస మనినాఁడు. మఱి శతకము కావ్య మెందుకు కాదు?

చిరంజీవి సుబ్రహ్మణ్యశర్మ చిరాయు రారోగ్యైశ్వర్య వంతుడై తనకు పరమేశ్వర ప్రసాదమువలన లభించిన యీ కవితాప్రౌఢి మార్గమును వృద్ధిజేసికొని భవిష్యత్తున సత్కృతులచేత నాంధ్ర భాషాయోష నలంకరించుఁ గావుత మని యాశీర్వదించు చున్నాను.

జయ
కార్తీక శుద్ధ త్రయోదశి,
విజయవాడ.

ఇట్లు,
కవిసామ్రాట్,
విశ్వనాథ సత్యనారాయణ.

భీమేశ్వరాయ నమః

# భీ మే శ్వ ర శ త క ము

శ్రీ నీహారధశాధరేంద్ర తనయాచిద్రూప పద్మావనా
ప్రాణస్థాననియంత! శాబ్దికకనద్ద్రాగ్దీపకాంతిచ్ఛటా!
శ్రీనాథాది సమస్తదేవ వినమచ్ఛ్రీపాదపద్మప్రభా!
గానానందమయస్వరూప! శివ! దక్షారామ భీమేశ్వరా!

ఆశాంతంబుల విద్యుదుజ్జ్వలలతాహాసంబులే నవ్యమై
యాశాసౌధ విచిత్రవర్ణరచనాహార్యంబు సౌందర్యమై
రాశీభూత సమస్తలోక హృదయారంభంబు సంరంభమై
యీశాన ప్రణయాగ్నిరూపమున ని న్నీక్షింతు భీమేశ్వరా!

మూఁడూ ళ్ళగ్గిని బుగ్గిచేసిన దొరా! పూవింటివాఁ డెప్పుడో
గాడ న్గుంచెల కోలఁ గొట్టె నని వీక న్నైచికన్ని ప్పుక
న్నామ్నాడ న్నుబ్బది యొనర్చినాఁడ వకటా! నా కేమి కూర్తింక నీ
తోడ వ్రాచిన, మేనబూదికడ నా తోడౌనా భీమేశ్వరా!

చటు లాషాఢపయోధరోదర మహాచండ ప్రగర్జాధ్వనిన్
పటుఝంఝూ పవనార్త ఘర్షణనదద్వ్యాఘోషితానోకహ
స్ఫుటగానమ్మున, వల్లకీ మధురవిస్ఫూర్తి న్మరొకప్పుడున్,
నటరాజా! స్తుతియింపలేని కొఱఁత న్మన్నించు, భీమేశ్వరా!

మును కైలాసము నీ నివాస మనఁగా మూర్ఖంబు వాకించి యా
నని మౌనంబున నూరకొంటి, యెదమోహం బెల్ల నీరూపమై
మను వే నీ వయినప్పుడట్లు లనఁగా మన్నింతు నే నెట్లు? నీ
వన వయ్యా! ప్రభు! వారణాసిహృదయం బన్నట్లు భీమేశ్వరా!

చూడన్వచ్చిన మామ దక్షుఁడు, జటాజూటోన్నదీస్వామి. మా
టాడం జెల్లదొ గౌరవం బతసతో! నైశ్వర్యగర్వాన నీ
వాడ న్లేదని గుండెలోఁ బొగిలి తా వైరంబునుంబూని నీ
చేడె న్వంచనచేసె, త ప్పెవరిదో చింతించు! భీమేశ్వరా!

కనదూహాపథగంధబంధురనట ద్గంగాపయఃపాయినై
నిను వర్ణింపఁగ నెంచి పూనిక తుద న్నీ జౌదు లోలోపలన్
కనువిప్పై కనలేనొ యౌవనమునన్? గాఢేహమై శ్రోత్రమౌ
మనువో! చెప్పుము, సర్వమంగళ సకన్మారంద! భీమేశ్వరా!

ఒక సందేహమువచ్చె, నిన్నడుగఁగా నూహింతునిన్నాళ్ళు, నీ
వకలంకప్రణయ ప్రబుద్ధుఁడవులే, ఆ యమ్మనింగారమా?
సకలోపాస్పద దేవతావిభవసత్సామ్రాజ్యపీఠమ్మ్న, నీ
విక కాపాలిక చక్రవర్తివికదా? యిం పెట్లు? భీమేశ్వరా!

అగునా వ్యాసుఁడు బ్రహ్మవేత్తృమునిసద్భక్తయుచ్చోటకాశిన్ సదా
తగు శిష్యుల్గొలువంగ మాధుకరిదైయౌ తానున్న, యన్నంబు లే
మిగ నీవే పొనరించి తిట్టితివి, సామీ! పొమ్ము పొ మ్మం[illegible]
మగువే యాకలిదీర్చె యామెనయమా మన్నింప, భీ[illegible]

జయ గంగాధర! దేవదేవ! జయ సంజ్ఞానాత్మ! సర్వాత్మకా!
జయ హాలాహల పీతపీవరగళా! జ్వాలానిటాలేక్షణా!
జయ శోభామయశైలిహార! జయగర్జా తీవ్రవాగ్వైభవా!
జయ చండీస్ఫురదర్ధదేహా! విలయేశా! శర్వ! భీమేశ్వరా!

నా చిన్నప్పటినుండి నీ నసన ప్రాణం బెల్ల విప్పారి, హా
చా చాంపేయ సువాసనాస్పదమునస్సంతోష మార్గమ్మునన్
ధీచాతుర్యపృథగ్విధాకలిత గీతిం బాడ యత్నించి, నా
కీ చింతాస్మృతి దూరమున్న దిగులా యీశాన! భీమేశ్వరా!

నదులుం గొండలు నీటిబుబ్బులు తరు ల్కన్యాప్రసూనావళుల్
కదుపుల్గట్టిన యాలమందలును జుక్కల్ సాంధ్యరాగమ్ములు
న్మదిలో 'దేవుల'వంటి పిల్లలు ప్రియ న్నాట్యక్రియామూర్తులై
చదలం దేగెడు పిట్టలుం దలఁప నీ చందంబు భీమేశ్వరా!

ఆ యక్షేశ్వరుఁ డట్టి మిత్రుఁడు తుషారాద్రీంద్ర పుత్త్రీగత
ప్రేమోభావపుఁ జిద్విలాసముదు. మంద్రీభూతవిక్రాంతి కా
ప్రాయంబున్న కుమారుఁడున్ గలుగు సంపద్గర్వ మేమాత్రమున్
నీ యాకారముఁ జూడఁ దోఁపదు కదా, నిష్పాద్య! భీమేశ్వరా!

ఉవ్వెంబుల్గుల వోసికన్నులు, విరుల్ రువ్వించు లేనవ్వులున్
రవ్వల్జిందెడు పైడిగంట పలుకుల్ రంగారు సింగారముల్
మువ్వంబన్నువుగొన్న చెన్ను తలఁపుల్ మాతల్లి సౌందర్యముల్
దవ్వౌ సోయగ మున్న నీకు మనసై దర్పింతు, భీమేశ్వరా!

శనివారోత్సవవేళ దంపతుల మీా చందంబు విడ్డూరమై
వినువారిం గెరటాలనవ్వఁ దెఱలు స్వీక్షింప నుల్లాసము
ల్దనుకన్ జూచెడు కొంటెచూపులును పంతంబాడుచున్నట్లుగా
కనులన్ గ్రొత్తఁగ నైన జంటవలెనే గాన్పింత్రుఁ భీమేశ్వరా!

అసితా తామరరేకు లట్టికనులం దా కజ్జలస్పర్శ, పై
నొసటంగుంకుమబొట్టు, నాసఁదొడవుం దోపై నయారైకయున్
ఘుసృణంబద్దిన చీరయు న్మెఱయ, నుక్తు ల్జెప్పి, నవ్వించి, క
న్గొసలన్ నిన్గను మానికమ్మగల నీకు న్జోత! భీమేశ్వరా!

మాణిక్యాంబయు నీవు దక్షపురి సామ్రాజ్యంబు శాసింపఁగా
నేణాంకోన్నమితార్ద్రి భావలహరీహేవాకవేళాచల
ద్వీణారావముతోడ గీతముల నే విన్పింప నే మందువో?
మాణిక్యస్నపిత ప్రసిద్ధగుణ సమ్రాణ్మూర్తి, భీమేశ్వరా!

కాపర్ధంబున గంగ, క్రింద నెలయుఁ ఖట్వాంగ మాచేతనుఁ
దీపాక్షంబు లలాటమందు, చెవులం దీపించు గ్రొందమ్మిలుఁ
వే పాము ల్భుజకీర్తులు న్పునుకలుం బేరుల్, గటిం జర్మముఁ
శ్రీపాదంబుల పావకోళ్ళఁ దగు నిన్జింతింతు భీమేశ్వరా!

దేవా! నీ చెలువంబు నూహాల మహాబ్ధిం దేలి డిండీర శో
భావిష్కారత నొడ్డువట్టి యటులై యుంతౌన, నా యిష్టమే
గావింపంబడెఁగాని, రూప మెటులో గాన్పింప; దూహావధిన్
ధీవైశద్యము దాటదో నరున కుద్వేగాన? భీమేశ్వరా!

శ్రీవాణీపతులుఁ శచీవిభుఁడు నీ చిద్రూపముం గాంచుచుం
దేవా! శర్వ! నిరూపితాఖిల మనోఽధిష్ఠాత! బుధ్నా! భవా!
గ్రావాకల్పితలింగరూప! శివ! దక్షారామ సౌందర్య న
ద్దేవీ శాంభవి ప్రాణనాథ! యని సిద్ధింబోరో, భీమేశ్వరా!

తొలి నా వ్యాస ఘటోద్భవుల్ స్వసితచాక్షోరాశి విజ్ఞాను లు
చ్చలదూహాస్మితబంధురుల్ మునులు సశ్వాంచల్యులుద్గాతలుఁ
గళలాస్వాములు నీ పదాంబుజములన్ గానమ్ము సేయంగ నా
కులచిత్తుండగు నేను నిన్ను దలఁపన్ గొప్పేమి? భీమేశ్వరా!

వార్వీధీనట దబ్జినీకలికలై వ్యాపించి యూర్ధ్వమ్ముగా
స్వర్వేశ్యాశతలాస్యసంఘటిత హస్తద్వంద్వముల్ మండలాం
తర్వాణీ పద ఘంటికానికరవాద్యస్ఫూర్తితోఁ నాడ, గం
ధర్వుల్ బాడ నుతింతు నిన్ను, బహు విద్యాదేవ! భీమేశ్వరా!

శరదాకాశ విజృంభమాణ సిత శంసన్మేఘమున్ దెక్కి ని
ర్భర చాంద్రీమృదుడోలల న్నడచి, య్యాక్షస్పష్టతారావళీ
శరదత్తార్ఘ్యము లంది, చాలితలతా కాంతాంగ గంధానిలా
దరబంధమ్మున నాఁగి, రమ్యిచట నిద్దర్శింతు, భీమేశ్వరా!

నేనో నిస్స్వుఁడ, రమ్ము రమ్మనుచు నీ నైతృత్వ మర్యాదల
న్గానీ యింటికి వచ్చినప్పు డయిన న్గాపాడఁగాఁజాల, నా
కానుల్ డబ్బులు వెచ్చఁబెట్టి నిను నాకర్షించుకోలే నటం
చే నాఁడో యది తేల; నీదయకదా? యేమందు భీమేశ్వరా!

ఒక వేళెప్పుడొ నన్నుఁ బ్రోచుటకునై యూహించి యస్మద్గృహం
బొక పారన్ గలచోట నంది యురమందూగించి ఘంటాధ్వనిన్
సకరంబొప్పఁగ రాకఁ జెప్పునపుడే నిన్ స్నిస్వలోకించుచో
వికలంబై చనుఁగాన, సర్వ మిపుడే విన్పింతు, భీమేశ్వరా!

ఆకాశంబున పాలదారిఁబడి నీహారాద్రిరాట్కన్య నీ
సోకెల్లన్ సొదవెట్ట 'నంది' మెడలోఁ జోద్యమ్ముగా గంగపోల్
వాకై మువ్వలుమ్రోయ, సిట్టజడలో వార్లిలగా నాడ మా
లోకం బేలఁగ నాగమింతు నది నీ లోపంబు, భీమేశ్వరా!

ఇంటన్ లక్ష్మియు లేసి లక్ష్మి యనఁగా హేలాచమత్కారమై
రెంట న్నా మది మున్గితేలు సుఖమై క్రీడాపరిష్కారమై
జంటన్ బాయక యుంట శాశ్వతకథాసంబాధమై తోఁచు నీ
యింటం గల్మియె లేమ, యిర్వురనఁగా నేమయ్యె? భీమేశ్వరా!

ఎటుపూజింపఁ దలంచినన్ గనులకే యేపుష్పముల్ దోఁచినన్
జటలోఁ క్రొన్నెలవంకవోలె నగునా? చర్పింపనే సీనమున్
జట మిన్నేరయి జాటి పాద్య మగునా? సాహిత్యమే పూజగా
నటనాసౌష్ఠవమూర్తి! చేకొనుచు నానందించు, భీమేశ్వరా!

ధృతి మానీశ్వరమార్గ మూఁది చనుబుద్ధిన్ దీవ్రకల్లోలమై
యతి లోకోద్యమ చిత్రతంత్రులను నాహ్లాదించి శోధించి, సం
గతులన్ సుస్వర కల్పనావధుల సంకల్పించి మీటంగ, నా
శ్రుతి కాలంబును వీడి పల్కసిగతి న్సూచించు, భీమేశ్వరా!

కాలం బన్నది యూహలో విరియు సంకల్పంబుగాఁ దోఁచి, శో
భాలాభాకృతి దుఃఖసంగ్రథితమై వ్యాపింపఁగా మానవుల్
కేళింగొందురు కంటగింతురు, మదిం గ్రీడించుటే సత్యమై
కాలం బీవును నాకు నొక్కటగుచుం గాన్పింత్రు, భీమేశ్వరా!

గతకాలాదృత కాంతిపుంజములు సోక న్వర్తమానంబు గుం
ఫిత సర్వార్థకథావిధానముల గంభీరమ్ము; తత్కాంతి శో
భితమౌ నీడను సంభవిష్య మనఁగాఁ బ్రీతిన్ విరాజిల్లు నా
మతి కీ బంధము వెన్క నీవలరుటే మాన్యంబు, భీమేశ్వరా!

వరలన్ జీవితమెల్ల జాతరవలెన్ వహ్వాయటంచుం గనుల్
శిరమందుంచి మదించి చంచలవపుశ్శ్రీసర్వమున్ భోగమై
తరులు న్జింకలు నూయెలల్ దురఁగముల్ గాన్పింపఁ దా దిర్దిర
న్దిరుగన్ అంకులరాట్న మాఁగి నరుఁ డాధింబొందు, భీమేశ్వరా!

సురఘుంటాపథ మద్ది, దుఃఖ మనఁగా శూన్యంబు! శాంతస్థితిం
బరగున్ భోగము సౌఖ్యమున్ మఘవుఁడే మద్యంబు సేవించి సుం
దరులంబొందినఁ గాదో నీ నరులవిధ్వంసంబు గావింప, నా
సురఘుంటాపథ మిద్ది సర్వాలు దొరల్జూడంగ, భీమేశ్వరా!

సిరి యుత్సంగమునందుఁ బుట్టి సుఖియై సింగారఁపుందోఁటయై
మరియాదల్ పదవుల్ మహావిభవముల్ మార్దంగికుల్ గాయకుల్
పరితోషాస్పద బుద్ధులైన వనితల్ బట్టంగ గర్వాంధుఁడై
పరదారిద్ర్యము నీసడించి కసరున్ ఫాలాక్షు! భీమేశ్వరా!

చెమటా? శూన్యము; లోకవృత్తరచనా చాతుర్యమా? సున్నసం
పదయా? కల్గినలేమి; నృత్యసదనమా? పాషాణమౌ నందమా?
మదదంతావళికేళి; మాటసొబగా? మాత్సర్యసంగీత; మే
పదవి న్మెట్టినమెట్టి; యిట్టికలుషు న్బాలింతు భీమేశ్వరా!

కనుదుర్మార్గులఁ జూచుచుంటి జగతిన్ క్రవ్యాదుల న్దొల్లిటన్
గుడుసుళ్ళం బడఁగొట్టి దోంచి తను నాకాయించి జెవింగొంచు సి
గుడిలోలింగము మ్రింగఁజూచుఖలుసిన్ గుళ్ళెల్ల తామ్రింగఁగా
వడి నోర్వెట్టెడు దుష్టు నామనవిగాఁ బంపింతు భీమేశ్వరా!

స్వార్థారణ్యమహోగ్రజాంతవమున స్వాతంత్ర్య సంఘోషణ
స్పర్థాబద్ధ పథాధికాచరణవిస్పష్టార్థ గీర్వాణు లీ
నిర్ధూతాఖిలబుద్ధు లన్న పలుకే నిత్యక్రియాలోకమై
నిర్ధారించు టెరుంగవో బ్రదుకులన్ నిస్వార్థ! భీమేశ్వరా!

మాదేశంబునఁ బర్యటింపుము సను స్మర్యాదగాఁ జూతువే!
పేదల్ గూడును గుడ్డలేక తిరుగన్! భిక్షార్థులై పిల్లలున్
లేదన్నం బని యేడ్వ పాటుపడినన్ లేదన్న యార్తధ్వనుల్
గాదయ్యా వినిపించు? సిగ్గరు నెటుల్ గర్వింతు? భీమేశ్వరా!

జననీదాస్యము వాపి, సత్కృతుల నోజంగన్న విజ్ఞాను లీ
జనులం దాశలఁగొల్పి, రాష్ట్రపదవీ సంస్థానపీఠమ్ములం
దునఁగూర్చుండి, బికారులౌ ప్రజలతోఁ దూఁగాడు దేశాప్తులై
తమ కర్జంబులుగాక, ఆత్మ పరమందం బంద్రు భీమేశ్వరా!

జలగల్ నెత్తురుపీల్చిన ట్లోరులు మోసంబైన రోసంబుతో
కలిమిఁ దోఁగిలు నాఁడు శాంతిసమరస్కంధాంధ్రులై గెంటగాఁ
బలిమిం బుత్రులు; శత్రు లెల్ల దోలఁగఁ , మాతల్లికిం బిడ్డలా
జలగల్ వోలె నియంతలై రెటుసనుఁ జాడ్యమ్ము? భీమేశ్వరా!

నిర్మర్యాదులు లౌకికార్థములకై సశ్శ్రేణి గల్పించి, 'యా
భగ్నంబియ్యది మీదు భాగ్య' మనుచుం బ్రస్తావనల్జేయు, మా
ధర్మం బంచును దుష్టచేష్టలగతిం దర్పించి పై కెక్కుచో
కర్మల్ పండి నశింత్రు యంతలు నిరాఘాటార్థ! భీమేశ్వరా!

సిరి నీరాజన మెత్తి, పశ్చిమదిశా సీమంతినీకాంతు లు
గ్రగణోన్మాదులు సర్వదేశముల నగ్రస్థానముం బొందు కా
వరమై నిర్మిత మారణాస్త్రముల విశ్వంబేదు నట్లీహాలం
బరపఁ మానవజాతి శోకవిలయాంధం బయ్యె, భీమేశ్వరా!

అలశాస్త్రజ్ఞులు మానవాళికొఱకా యా శోధనల్ జేసి, సాం
పిల సూహాల్ బహుచిత్రవస్తువులుగాఁ బ్రీతిఁ బ్రసాదింప, నీ
యిల రాజన్యులవంటి నాయకులు హాయింగూర్చి యవ్వారికిఁ
కులవిధ్వంస మహాస్త్రశోధనల లోగొన్నారు భీమేశ్వరా!

నయనుత్తాల మహాశయంబులు, నవస్వర్గరేహా సౌఖ్యంబు లీ
నయశాస్త్రార్థము లాత్తసంస్కృతి మహానందంబు లీ 'నాగర
ద్వయ' బంధంబులు శాస్త్రశోధనలు శోభఁగూర్చి దేశాలనుఁ
భయము న్మాన్పనినాడు గొప్ప లగునా? భద్రేహా! భీమేశ్వరా!

నాకీ జీవితమార్గ మందుదయ మన్యాయ్యంబు సాయంత్ర మం
దూకింపంగల నాయముం గలిపి మాయుల్గల్గు లోకమ్ములో
శోకంబు న్సుఖముం బొనర్చి యొకచో సున్నంబు వేఱొక్కచో
దాకన్వెన్నయుఁ గన్నుఁదోయి నిడ మోదంబేమి? భీమేశ్వరా!

ఇల 'సామాన్య' జనాళి జీవితములం దేనాఁడు దైనందిన
ప్రళయంబు ల్నశియించి భాగ్య మగునో బ్రహ్మా! సిరావల్లరీ
నిలయుల్ పోలిన కష్టకాయుల యెదన్ నిర్దుష్ట సుస్పందనం
బిల నే నాఁడు నదించునో యది మహాహీరంబు, భీమేశ్వరా!

అయ్యో! కోపమువచ్చి యేమగును నాకన్యాయముంగాంచి, నీ
కుయ్యాలంబడి యూగి నట్లగునుగా! యున్మాద దుర్మార్గ ముం
గయ్యాలంగని వాన మేల? అవులే! గంగాసరిద్దేవితో
సయ్యాటంబులు చాల వేమొ! తగు నీవ త్కేళి, భీమేశ్వరా!

ఘనులై త్యాగ మొనర్చినట్టి ఘనుల న్దర్శించితిన్దొల్లి, దా
మనుకూల స్థితిఁ జూచి చేయరదియుం 'మర్యాద మార్గ మునన్
ఘనతన్ బొందను జేయ' రద్ది యటులే గావింప నిచ్ఛింతు నీ
యనయుల్దాన మొనర్చి రెండవది తామన్నారు భీమేశ్వరా!

కాసుల్ రాసులుపోసి పూజసలుపం గాంక్షింప, వాచాలత
న్మోసుల్ దేర్చినరీతి హీనుఁ బొగడం బోనయ్యా, నాకోసమై
వేసంబు ల్దెగమార్చి మోస మొలయ స్వైరత్వముం జూప రా
కాసుల్ ద్రోహ మొనర్పలేని గతుల న్గల్పించు, భీమేశ్వరా!

పైకిన్ శ్రోత్రియ తాపసరూఢి యొసగన్ బద్మాసనంబుండి, నీ
రాకన్ గోరి జపించునట్లు నటనారంభంబు గావించుచున్
'శ్రీ కైలాస నివాస! యీశ!' యనుచుం జింతించి గాఢేహులై
లోకుల్గొందఱు కాంత, కాంచనములన్ లోఁగొంద్రు భీమేశ్వరా!

పరిశీలింప మహాధికారపదవీ ప్రాప్త్యాశపై లై జనుల్
కరిఘీంకారము నక్కజిత్తులు నళీకవ్యాఘ్రకుండోదరం
బిరవై యొప్పిచరింత్రుగాని, తుదకం తే దక్కపాపాత్ములై
ధరసర్వస్వము దోసిపోదురుయథార్థం బిద్ది! భీమేశ్వరా!

చదువుద్యోగము పట్టణనాగరకతా సాంగత్యశోభాగతిన్
గొదువన్నప్పడనీక డాబుసరిగా గొప్పం బ్రసారించు చుం
బ్రదుకన్ సంఘముమెచ్చునానరుని, నాపద్వేళమిథ్యోన్నతుల్
నిదురించుందన కాత్మవంచనవిధి, న్నిర్నిద్ర, భీమేశ్వరా!

భావమ్ముల్ గలవారు లోకమున శోభామూర్తులైయుండు, రా
భావంబుల్ జగమందు వాస్తవదశా ప్రాప్తింగనం జెల్లి శో
భావైశద్యముఁ దెచ్చుఁ, బౌరుషమునన్ బాటింప యత్నంబులే
గాలింపన్ దొరకోని వానిగతి వైకల్యంబు, భీమేశ్వరా!

రతనంబుల్ మణులున్ మహాసభలలో రంజిల్ల కాంతిచ్ఛటా
వితతిన్ జిమ్ముచుఁ జీకటిం దొలఁచుఁగా విస్ఫారమహాలోక, మా
వితముంగాంచిన బొగ్గులేడ్చి సభ గావింపంగ నేమౌనహో!
ప్రతిభావంతులదారి హీనమతులన్ భంగించు, భీమేశ్వరా!

మతవైషమ్యమువర్ణ భేదమును నస్మన్మాతృసాళాంతరా
మృతరక్తాపగపుర్వులై విషము వర్ధిల్ల స్వనోదింప, దూ
షి.తదేహమ్మగు నెల్ల కాలము; పరుల్ జేవస్వజృంభింత్రు; సం
తతిదుఃఖింపఁగ భారతమ్ములొసు గా దార్ఢ్యాన, భీమేశ్వరా!

అలుకజ్జూడకు దేవదేవ! నను సాహంకారదుష్టక్రియా
కలుషుఁ, నీపదసన్నిధాన వెలుఁ గాకాంక్షించుయత్నమ్మునం
దలుసౌ దారులహాని నొంది దిగులై యాక్రోశముంజేసి ని
స్తులపాదద్వయిదూరమెంతు, నెపుడో చూపించు, భీమేశ్వరా!

ప్రాతల్ గ్రొత్తలు కీర్తులఁ బ్రదుకు సంబంధాన పత్రాలలో
చేతల్ బట్టి ప్రతిష్ఠలంగొనుచు నుజ్జీలొచు జీవించు నే
నేతల్ దేశపృథగ్వి ధోన్నతుల కొనేర్పెల్ల నిస్వమ్ముగా
చేతంజేసిరి? సొంతమన్నఘనమై జీవించి, భీమేశ్వరా!

కవిః రాద్ధాంతపు రాజకీయముల వైక్లబ్యంబునూహించి, సం
భవకల్యాణ విశాలసూత్రముల విశ్వ వ్యాప్తిఁగావించి, నీ
రవదృగ్విధుల శాంతభావలహరీ రావమ్ము కాలమ్మునోఁ
గవయించాచును; బతుముల్గొనఁడు సంఘర్షించి, భీమేశ్వరా!

నినుకష్టాలగు వేళనే దలఁతునేని చెప్ప? సౌఖ్యమ్ము వే
ళనుమాత్రంబెతలంచినాఁడ! నగజాలాస్యంబు నీక్షించు నీ
పనికిన్నా యెదభక్తి భావమున కావంతైన సంబంధము
న్గనవా? ప్రేమము భిన్నరూపములుగా గాన్పించి భీమేశ్వరా!

నాకున్నర్ఘ్యన మిత్తు వేయనుము పణ్యాజీవి వోలెన్నినుఁ
జీకాకుం గలిపించి బేరముల నా చిత్తంబులోఁ గోర్కుల
స్తోకంబుల్ దగ దీర్పుమంచడుగ, నెంతో మెచ్చికొందున్గదే!
నా కన్నుల్ శతపత్రపీఠములు విన్యాసించి భీమేశ్వరా!

అనుసత్త్వంబును నోగిరం బొసఁగి నీ యంతర్జ్వలద్దీపకాం
చనరేఖాసముదంచిత ప్రణయవిశ్వాసమ్ము నాయందు వి
ప్పునఁ బొందం దయఁజూచి నావదియె మత్పూర్వక్రియాలబ్ధశో
భనమై మోదుగపూతయైనదది యేభాగ్యంబు భీమేశ్వరా!

పరిహాసించిన దుష్టసర్గ మరిషడ్వర్గంబు విద్వేషమై
కరవాలమ్ముల దూసియుద్ధమునకుం గాల్ద్రివ్వ మార్కొంటి, నా
శిరముఁ ద్రుంచునిమిత్తముల్ చెడిచుట్ జిత్ప్రవృత్తి చేఖడ్గముఁ
విరుగంగొట్టెను వజ్రహాసమున నన్వీక్షించు భీమేశ్వరా!

ఆదిఁ సృష్టియు, మధ్యపోషణము, సంహారమ్ము కార్యమ్ములై
మోదింపన్ధరకొంట కారణముఁగా బోధించిరయ్యా! మఱీ
మోదంబన్నది నీకునేల? కలిగెంబో మమ్ము నేడ్పింపఁగా!
మాదాకుల్ సరిదిద్దిపోవుటది నీ మర్యాద భీమేశ్వరా!

సత్యంబన్నది నీవుగా నుపనిషత్సర్వస్వముం జెప్పి, నీ
సత్యత్వంబును ధర్మముం జననుగా నీ, నీదు హేలాకళా
పత్యం బీ జగమెల్ల సత్యమనెనా! పాటింతు రీ యెల్లరు
స్సత్యంబీతమ మన్కియించు, దెలియఁ నేర్పించు భీమేశ్వరా!

ఆచార్యుండగు సువృత్తివట్టి తనమున్ చన్నావుగా నీ సనున్
ప్రాచీనుల్ దగుదేశికోత్తములు సంపచ్చంద్ర మాహుః సుహా
వాచాసౌష్ఠవ మొప్ప సద్గురుడుగా వర్ణింప శ్లోకింట్సు మా
ధీచాతుర్యము నీదు కీర్తి కిచటన్ దీపమ్ము భీమేశ్వరా!

తొలిశాస్త్రమ్ములు నీ మహాగ్రముల నంతో నిర్వదింపంగ నీ
మలిశాస్త్రమ్ములవంటి వీనసలు సామర్థ్యార్థమూపమ్ముగా
నిలలేవంచుఁ బ్రచారముం జరిపి మా కిచ్చె సహాంకారపుం
బలుపుంగూర్చె, సికెట్టిదారిఁ బహునో భాషించు భీమేశ్వరా!

జననంబప్పుడు కన్నతల్లి యొడిలో సాగన్ సమస్తావనీ
ఘనకేళీమృదుహాస మొక్కటి సమగ్రప్రాణి లోకమ్మునన్
జననంబున్ మరిమృత్యుదేవతయుఁ దోఁచన్ దల్లులైమధ్య నా
జననీ వత్సలతా విధాన మొక నిశ్వాసమ్ము భీమేశ్వరా!

ఏమయ్యా యని పిల్చి నిన్నడుగఁగా నేనాటికిన్ దిక్కు నీ
వామై వచ్చిన నేనుగూడ నటులే యోదంచు నాతన్వి ని
న్నేమో తిట్టును జోగికాడనుచు నే నన్నాళ్ళుగాఁ జెప్ప తా
నేమో నమ్మదు నమ్మినప్పడెపుడో యేతెంతు భీమేశ్వరా!

నీ మూర్ధంబున జేయివెట్ట; గడపన్ నిన్ గావలింబెట్ట, నీ
వేమో మెచ్చియొసంగు నావరములన్ హింసింప యోగీశులన్
భీమంబైన బలాన నీ సదనమున్ బెడ్డట్టు లాడింప, నీ
వేమీ భీతిలకయ్య పూర్వమటులే మిన్నాయె భీమేశ్వరా!

హద్దుల్ పద్దులు పెట్టి, సృష్టిగతిప్రత్యూహమ్ము నూహించు మా
విద్దెల్ గర్వములెల్ల దండితములై పీడన్వడం జేతు నీ
సిద్ధుల్ సోకని మాకు నీకృతిసతీ శిక్షావలోకమ్ముతో
హద్దా జీవితమాగి నీవగు పరీహాసమ్ము భీమేశ్వరా!

ప్రమదుల్ రుంజలకొమ్ముబూరాలను బూరాల్ దప్పెటల్ శంఖముల్
డమరుల్ తోళ్ళను మద్దెలల్ గొని నిరాటంకక్రియన్ ధ్వానసం
దమరన్ వేయివిధాల నాదము సమాహారమ్ము గావింప నీ
ప్రమథోద్గోల్లయి వింటకంటగనగా నూహింతు భీమేశ్వరా!

దృశ్యంబై చను సర్వలోకమును నాదృష్టింబరీక్షించు చు
న్నశ్యంబంచు నెఱింగితిన్ తనువులోనన్ జీవముత్తాలమై
నశ్యంబై యనుభూతి లేశముల బోవంబూను నాకృష్టమై
పశ్యత్పాల! యిదెట్టిమాగ్బలతయో పాలించు భీమేశ్వరా!

ఘనుడుం జచ్చును నల్పుడున్ జనుయు నాకంబేగునో మోక్షమో
కనులంగాంచము గాని, యిద్వరకు నీ కారుణ్యమున్ కర్మలం
దినమార్గంబని ప్రాజ్ఞులందరు మహాధీశాలి కీచావునుం
దినుటోవండజు జేశమేగునటులో దీపించు భీమేశ్వరా!

గౌరీకంకణ కింకిణీరవచలద్ధ్వానమ్ము గంగాపయః
పారీధారలమర్మరధ్వనుల శోభంగొంత లగ్గింప నీ
వారల్ గారణమల్లుకొంచు దగవుం బాటించు నా వేళ నే
పోరమ్మిచ్చుటకే గొంపచల్లవడినం బోవచ్చు భీమేశ్వరా!

నీలీలావధి యేటిపాటుదలలో నీహాస మిాపూలలో
నీలోకావన మారుకాలములతో నీసొంపువన్యాళిలో
నీలోగానములీ దివారవములో నిత్యమ్ము దర్శించునా
కేలానీకువయాళిరూపమున? నిక్లైత్యృప్తి భీమేశ్వరా!

క్షీరోదన్వదుదార గర్భమున నిక్షిప్తాచ్ఛ పీయూషముల్
వీరుల్ రాక్షసులుల్ సురల్ గొనఁగ సంవిన్మూర్తిమంథాచలుల్
గోరల్ గ్రావములై మథించెనతఁడుల్; ఘోరంబుహాలాహాలం
బూరెన్మందుర; నద్రికంఠగతమైయున్నావు; భీమేశ్వరా!

ఇషువై విష్ణువుమేరువై ధనువునై హింసాప్రతిష్ఠావిధిల్
సుషమామూర్తివినీవు వింటిదొరవై, మూడంగ గీర్వాణు, లా
విషసంవర్ధిత శక్తికోలవిడువల్, విధ్వంసమాసుళ్ళగో
కషణాగ్నిందగు లింగభాగమిచటం గల్పింతు భీమేశ్వరా!

రక్తాశోకము పూతపట్టినయెడల్ రంజిల్లురాగమ్ము నీ
భక్తుల్ వక్తలు, శీలవంతులు బుధుల్ బంచంగఁజేకొంచు, నా
కుక్తుల్ జెప్పఁగ నోరురాక, మదిలో నూహించి కేల్మోడ్తు, నీ
రక్తింబంచని జాతిగుండెల నెట్లుప్రార్థింతు? భీమేశ్వరా!

కాలంబన్నపథాన, నాగరకతా కాత్రస్వరోద్యన్మహా
లీలాలోలరథాన. మానవమనోలీఢంబు సంసారమే
కేళీవైభవమూర్తి, యుగ్యములుగా కేంద్రీకృతా దర్శముల్
మేలైయొప్పి గమించు సత్కృతులు నున్మేషించి, భీమేశ్వరా!

శ్రీమన్నిగ్ధరచంద్రమః ప్రథితచాంద్రీపూర్ణ జూటాట వీ!
కామావేశధునీధుని భవమునో గర్వమ్ముతీరానకుఁ
రా, మార్గంబును జూపుచుంటి మణిసీరత్నాల నిమ్మంటినా?
యేమీ చెప్పవు! దుఃఖసాగరమునందీదింతు భీమేశ్వరా!

అడకింపం దగునయ్య నీకునను? సోఽహంబన్నయూహాన్మదిఁ
కడలిం బొంగులమీఱది చంద్రకళలస్గన్నప్పుడుఁ, వ్యోమమున్
నడిరేయిం దిలకించినప్పుడు, సతిం ద్రాగ్దీప్తి మన్నప్పుడుఁ
కడఁకంజూచి శరీరమున్మఱచి, నిగ్గాత్మింతు భీమేశ్వరా!

ఔలే! నామొఱలాలకింపవు, బలే యాచార్యమయ్యా దొరా!
ప్రాలేయాచల శృంగవీధి నెచటో ప్రాసాదమం దార్యతో
నాలోచించినగాని చెప్పుటను నీ కత్యంతముఁ దోఁచదో!
యేలా రక్షణకౌనుగాదనినచో హింసింప? భీమేశ్వరా!

చంద్రాబద్ధ జటాకటాహ నివసత్స్వర్వారి నిస్వానముల్
రుంద్రోద్యత్త్రప మధాధినాథ పటహారూఢ ప్రతి ధ్వానముల్
మంద్రీభూత సురీగళోద్గత గళన్మారంద గాంధర్వముల్
సంద్రంబుల్ ధ్వనులిడ్డ తాండవకళా సంసక్త భీమేశ్వరా!

శుష్మాయత్త నిటాలచిత్రకనటచ్ఛోభాగ్ని ఖండప్రభల్
గ్రీష్మాతీత విశిష్ట భాస్కరగళ ద్గీర్వాణ కాంతిచ్ఛటల్
భీష్మావర్తిత వక్త్రనిర్గత మహాబీజ్య ప్రభావంబులుఁ
శుష్మోష్మ ప్రథలిడ్డ తాండవకళా సూత్రార్థ! భీమేశ్వరా!

శర్వాణీ జఘనావృతార్థ పరిత స్సంబద్ధ హస్తంబులన్
సర్వాంగ ప్రవిఘూర్ణ మానరస వత్సంచార మార్గంబులన్
ఘర్వోద్యద్ఘన ఘట్టన స్థగిత సంపత్పాద సంధానముల్
సర్వాణా కృతులిద్ధ తాండనకళా నీతార్థ! భీమేశ్వరా!

నిర్వ్యాహార్ధ శశాంక నిస్స్రుత చలన్నీరంధ్ర చాంద్రీ సరి
న్నిర్వ్యాతామృత బిందుసిస్తుల మహానిష్యంది మారందమై
యార్యామానస పుష్పమందలరి భ్రామ్యద్భావమై దీర్ఘమై
నిర్వ్యద్గంగను బొంపె తాండవకళా సర్వత్రి భీమేశ్వరా!

వర్షామేఘ ఘటాఘనా ఘన నదద్వ్యాపార కాంస్యమ్ము లా
కర్షించెన్ తతవాద్య విస్ఫురిత నిక్వాణమ్ము, తత్తధ్వనుల్
వర్షాభ్వీ సమనాదచర్మముల సంవర్తమ్ము గల్పింప సం
ఘర్షించెన్ సుషిరంబు, తాండవకళా గంభీర భీమేశ్వరా!

శ్రీ నందీశ్వర దేహాసర్మిత కనచ్ఛిం దూనరేఖావళుల్
సానందోత్కట హాసవర్ధిత సురీ సంబంధ లాతూరుచుల్
భూనవ్యాపృత సాంధ్య భాస్కర వలద్భ్రూభంగరాగాంశువుల్
లూబ్బనెన్వర్ణము [illegible] తాండవకళా ముక్తార్థ! భీమేశ్వరా!

డబుడక్కన్ బుడబుక్కలై సుడులునై థంకానినాదంబులై
డబుథున్ థుక్కసి శబ్దముల్ వెడలెనోటం దక్కముఙ్బుట్టినా
గుబురా వేదములెల్ల మేనఁ గలిగెన్, గోమొప్ప రాగంబు వే
డబమై తోఁచెను బ్రాచి తాండవము వేడ స్దీరె! భీశ్వమేరా!

మృతిసందష్ట మహాపదం బొరయుచుం బ్రీతిన్ ధనంబంచు సం
గతి నున్నట్టి భాగ్యయంచు నెవఁడో కార్పణ్యముంబూని త
న్నతి కష్టమ్ముల ముంచినాఁడనుచు నాహా! జీవిశయ్యాస్థలిన్
గతమున్వాకొన యేడ్చుచేఁ దఱచుగా గాన్పించు భీమేశ్వరా!

చితికాష్ఠమ్ములమీఁది బొమ్మనెపుడో శిల్పీ! విసర్జించి సం
చితిజీవమ్మును; తోఁచినట్లుమనెనా శిల్పమ్ము; సంధాన సం
గతిసిప్పట్టునఁగూడ నాడినది; నాకన్నుల్ ప్రకాశించి య
ప్రతిమానార్ధకళా విలాసునిసినుం బాటించె భీమేశ్వరా!

విధిసృష్టించుట! నిలయించుటకునో? వెన్నుండు పోషించుచేఁ;
గ్రథితాశాపథ! నిలయించుటకునో? కానంగరాదూహకున్
వధమున్ సృష్టియుఁ బోషణంబులొకచేఁ వచ్చెస్సునీదయ్యెనో?
పృథివీవర్తనమెల్ల యీగుణములం గ్రీడించు! భీమేశ్వరా!

అలసెన్ లోకము యుద్ధతాండవ మహాహంకారమార్గమ్ములన్
కలసెన్ లోకము భావనావధుల సత్కల్యాణ చింతాదృతిన్
సలచెన్ లోకము దృబ్ధదుఃఖగతుల నిశ్శ్వాసము న్మాన్ప, నీ
తలఁపుల్ గానుక వెట్టి, భావిసుఖబంధంబిమ్ము! భీమేశ్వరా!

ననలెల్లన్ వికసించు, గాడ్పుదోఁటయై నర్తించు నుప్పొంగుచు
స్పందించున్నదులెల్ల, నచ్చరవలె స్త్రీకైవిలాసించుచుం
గనిపించుం దెలిమబ్బు చక్కటిని, నాకంపించు శామంతులన్
దనియింపందిగ జారునంచు, చలిలో దాంపత్యమాదర్శమా
యనిపించుం, గుణభిన్నకాలచలన వ్యావిద్ధ! భీమేశ్వరా!

ఓవర్వీకరభూష! సంభృతమహా యోగీశ్వరోన్మేష! త
త్త్వైకర్యాప్లుతవేష! భక్తసరసీ సంపన్నానీ పోషణా!
వేదోద్యద్ఘనఘోష! మత్కృతిరణ ద్వీణామృతస్నానమై
యీ దర్శిన్, నిను బొందనంకితముగా నర్పింతు భీమేశ్వరా!

శ్రీ విశ్వేశ్వర! విశ్వనాథ! కవితా సింహాసనాధ్యాసి! శి
ల్పావిష్కార విశిష్టవైభవ! రసన్యస్త్రీ! మహాదేవ! గౌ
రీబాలాహాక ప్రావృడంబర! మహార్ధి భూతసంవిత్ప్రభూ!
శ్రీ వారాణసిదాస! కావ్యసుషమా శ్రీహాస! భీమేశ్వరా!

ధటినీ ధృగ్ధకపాల! పాలిత జనాధారా! ధరాభృత్సుతా
ఘటితాలాపచమత్క్రియాగళిత రేఖాహాస! హాసార్భటీ
భటనాట్యధ్వనితార్థవన్నిఖిల శోభా! శోభితాశా రుచా
ఘుటికాసిద్ధ! విశుద్ధభావ మెదలో ఘూర్ణిల్లు భీమేశ్వరా!

అధివిన్నాద్వయపాలనా చతుర! గంహాస్నిగ్ధ చిద్రూప! రా
గధునీసంగత ధర్మ్య! పూర్వ ధరణీకాంతుల్ చళుక్యాన్వయుల్
పృథు శిల్పాయతనమ్ముగట్టి నిను గౌరీనాథు సేవించి, రా
యధికారుల్ పరిపాలనా చణులు నీవై నట్లు భీమేశ్వరా!

పగులొమ్మేచ్ఛులు నీ శుభాయతన సంపత్కుడ్య మాణిక్యముల్
దరలింపన్ దొరవెట్టు లోర్చితివి రుద్రా! గుబ్బలై యిప్డు నీ
తరుణీనామక రత్నముల్ బదులుచే తన్నున్న పున్మద్దిలే
వరలున్ గోడల, వట్టి భిక్షుకుని భావంబిట్లు భీమేశ్వరా!

శ్రీ గోదావరి యంకపీఠమున నాసీనుండవై సప్త గో
దాగాథాంబులయందుఁ గ్రీడలకు నాహ్యాదేవికి న్మెచ్చి యా
యాగారమ్మున తొమ్మిదైన గ్రహాముల్ వ్యాపింపఁగాఁ జేసి తో
రా! గర్వమ్ము బడాయి నీకె తగు రారా సామి! భీమేశ్వరా!

పద శాస్త్రజ్ఞులు పండితుల్ కవులు నీ పాదద్వయీచిహ్నితుల్
చిదలంకారులు సంసదంతర మహాజిజ్ఞాసువుల్ మానవుల్
పదసంధాశశిమౌళిగీతి సుషమాభాషా సమావేశ సం
పద మన్నించుట నీ దయాగుణముఁగా భావింతు భీమేశ్వరా!